# పురుష లక్షణం

people may forget what you said ,people may forget what you did,but they will never forget how you made them feel. - Maya Angelou

Saturday, May 5, 2012

## స్క్రీన్‌ప్లే ఉపకరణాలు : పాత్ర చిత్రణ



పాత్ర చిత్రణ (Characterization): పాత్ర చిత్రణ తెలుసుకునే ముందు పాత్ర (Character) గురించి తెలుసుకుందాం. కారెక్టర్ అనే ఈ పదం
గ్రీకు పదాలైన Kharakter = Stamp, Kharassein = to engrave నుండి పుట్టింది. ముద్ర, చెక్కడం లేదా మలచడం అనేవి వీటి అర్థాలుగా తీసుకుంటే తనలోని గుణాల ద్వారా తనని తాను సంస్కరించుకుంటూ లేదా మరింత పతనమవుతూ తనని గమనించే వారిపై చెరిగిపోని ముద్రని వేసే దాన్నే పాత్రగా మనం చెప్పుకోవచ్చు. పాత్ర చిత్రణ కథానుసారంగా వుంటూ కథలో ఆ పాత్రకి కథకుడు గీసిన పరిధిలో తన గుణగణాలు, లక్షణాలని ప్రదర్శిస్తుంది. కథలోని సంఘటనలకి పాత్ర స్పందించే తీరుని బట్టి ఆ పాత్ర లక్షణాలని మనం అర్థం చేసుకుని ఇది ఈ రకమైన పాత్ర అని గుర్తిస్తాం. కథలో పాత్రలు సంఘటనలకి స్పందిస్తూ/సృష్టిస్తూ తమని తాము మలుచుకుంటాయి కాబట్టి, కథలో అన్ని పాత్రలూ కాకపోయినా కనీసం ప్రధానపాత్రలనైనా ఈ విధంగా మలిస్తే ఆ పాత్రలు ప్రేక్షకులకి ఎప్పటికీ గుర్తుండిపోతాయి - ఇదే చెరగని ముద్ర వేయడం అంటే. తనని తాను ఉన్నతంగానో లేదా మరింత చెడ్డగానో మలుచుకున్న పాత్ర ఏదైనా శాశ్వతంగా గుర్తుండిపోతుంది.

సాధారణంగా కథనాయకుడి పాత్ర ఎంతో కొంత ధర్మబద్ధమైన జీవితాన్ని గడుపుతుంటుంది. ఆచరిస్తున్న ధర్మానికి సంకటం ఏర్పడినప్పుడు ఆ పాత్ర నిజస్వరూపం బయటపడుతుంది. రాముడు రాజు అవ్వాల్సి వుండగా వనవాసానికి రంగం సిద్ధమవుతుంది. రాజ్యం పాలించడమా? పితృవాక్యాన్ని పాలించడమా? అనే సంకటంలో వున్నప్పుడు ధర్మానికి కట్టుబడిన పాత్ర కాబట్టి తండ్రి ఇచ్చిన మాటని నెరవేరుస్తాడు. త్యాగం మానవునికున్న గుణాలన్నిటిలోకి అత్యంత గొప్ప గుణం. గాడ్‌ఫాదర్ చిత్రంలో మార్లిన్ బ్రాండో మాఫియా నాయకుడైనప్పటికీ ఇతర మాఫియా నాయకుల్లా కాకుండా తనకి సాధ్యమైనంతలో ధర్మాన్ని పాటిస్తుంటాడు. ఇలాంటి సమయంలో అతని దగ్గరికి మత్తుమందులు సరఫరా చేసే వ్యక్తి తన వ్యాపారాన్ని అభివృద్ధి చేసుకోడానికి మార్లిన్ బ్రాండో సహకారం కోరతాడు. బ్రాండో సలహాదారాడు, కొడుకు మత్తు మందుల వ్యాపారానికి అనుకూలంగా



About Me



Aaditya Chowdary Mulpuri

Those that know do,Those that understand teach.

View my complete profile

My Blog List

గురుకులం



అఖిలాండకోటి బ్రహ్మాండ నాయక రాజాధిరాజ యోగిరాజ పరబ్రహ్మ సమర్థ సద్గురు శ్రీ శిరిడీ సాయినాథ మహరాజ్ కీ జై - ఓం శ్రీ సమర్థ సద్గురు సాయినాథాయ నమః *శిరిడీ సాయి బాబా జీవితంలో ముఖ్యఘట్టాలు*: 1.మొదట 16 సంవత్సరాల బాలుడిగా ప్రకటితమైన సంవత్సరం - 1854(వేప చెట్టు - ప్రస్తు...
*2 years ago*

ప్రకృతి& సౌందర్యం



కల్లోలం... - కలలు.. నిజం కావు ఎందుకో తెలీదు.. కల మధురం, ఐనా ఆయుష్షు అల్పమే అని తెలీదు.. తెలిసీ తెలియని వాస్తవాలే కలలై...కరుగుతాయని తెలీదు.. నిదుర లేచాక స్వప్న...
*1 year ago*

వున్నప్పటికీ ప్రజల ప్రయోజనాల దృష్ట్యా ఆ వ్యాపారానికి సహకరించడం తనకి ఇష్టం లేదని చెప్తాడు. ఇక్కడ నుండే అసలైన సమస్య మొదలవుతుంది. కాబట్టి కథానాయక పాత్రలెప్పుడు తనకి సాధ్యమైనంతలో ఎంతో కొంత ధర్మానికి కట్టుబడి వుండటం వల్ల ప్రతినాయక పాత్రతో విరోధం ఏర్పడటానికి మార్గం సుగమం చేస్తుంది. ఇద్దరి మధ్య వ్యత్యాసాన్ని చూస్తున్న వారు అర్ధం చేసుకోవడానికి ఇది ఎంతో ఉపయోగపడుతుంది. సినిమా అనేది మంచి చెడుల మధ్య భేదాన్ని స్పష్టంగా తెలియజేస్తుంది. కథానాయకుడి పాత్ర మంచి వైపు నిలబడుతుంది. తన ధర్మాన్ని కాపాడటం కోసం ప్రాణాలకైనా తెగిస్తుంది.

పాత్ర ఔచిత్యాన్ని తెలియజేసే సన్నివేశాలు :

పాత్ర చిత్రణలో రెండు దశలున్నాయి అవి
1.సాధారణ దశ (కథ ప్రారంభం అవకముందు) 2.అసాధారణ దశ.
కథ ప్రారంభం అయిన తర్వాత. ఫలానా ముసుగు వేసుకున్న పాత్ర అని మొదటిదాన్ని, నిజస్వరూపాన్ని బహిర్గతం చేసే పాత్ర అని రెండవ దాన్ని చెప్పుకోవచ్చు. సాధారణంగా కథ మొదలవగానే ఏ కథలోనూ అసలైన పాత్ర కనిపించదు (ఫ్లాష్‌బాక్ కథల్లో తప్ప) మనలా చిన్న సమస్యలకే కృంగిపోతూ, అల్ప సుఖాలకి పొంగిపోతూ వుండే పాత్రలే వుంటాయి. కానీ ఎప్పుడైతే పాత్రకి తన పరిధిలో తన ఉనికికే ప్రమాదం కలిగించే సమస్య ఎదురయిందో అప్పుడు ఆ పాత్ర తను వేసిన ముసుగు తొలగించి తన నిజస్వరూపాన్ని బహిర్గతం చేస్తుంది - సమస్య ఎదురయినప్పుడే ఎందుకు చెయ్యాలి అంటే ప్రకృతిలో ఏ ప్రాణీ కూడా అవసరానికి మించి శక్తిని వ్యయం చెయ్యదు. పాత్ర తన జీవితంలో ఏ విషయానికి అత్యంత ప్రాముఖ్యత ఇస్తుందో దాన్నే మనం ఉనికి అని అర్థం చేసుకోవాలి - కొన్ని పాత్రలకి ప్రాణం గొప్పది కావచ్చు, కొన్నిటికి పరువే గొప్పది కావచ్చు, మరికొన్నిటికి ఇచ్చిన మాట ఇలా చెప్తూ పోతే ఎన్నో ఉదాహరణలున్నాయి.

ఏ సమస్య తన జీవితంలో అలజడిని సృష్టించి సమతౌల్యాన్ని దెబ్బతీసిందో ఆ సమస్యని శాశ్వతంగా పరిష్కరించి తన జీవితంలో శాంతి నెలకొనే వరకూ ఆ పాత్ర నిజస్వరూపాన్ని మనం చూస్తూనే వుంటాం. సమస్య ముగిసిన తర్వాత అది నైతిక విలువలు కలిగిన పాత్ర ఐతే మంచి సంస్కారాన్ని పొంది ఉన్నత స్థితిని పొందుతుంది, లేదు దుష్ట సంస్కారం కలిగిన పాత్ర ఐతే ఇంకాస్త దిగజారి పతనమవుతుంది. కథలో వుండే ప్రతి పాత్ర కథానాయకుడి చేత ప్రభావితమై వుంటుంది. ఇలా కథానాయకుడు ఇతర పాత్రలని ప్రభావితం చెయ్యగలిగినప్పుడే అతని పరిధి విస్తృతమై అతని ప్రాముఖ్యతని అందరూ గుర్తిస్తారు లేదంటే కథానాయకుడు నామమాత్రంగా కథలో మిగిలిపోతాడు.

ఇప్పుడు పాత్రని రుపొందించేప్పుడు ఏ ఏ అంశాలని పరిగణనలోకి తీసుకోవాలో చూద్దాం.
ఇవి రెండు రకాలు :
1. అంతర్గత, బహిర్గత చరిత్రలు 2.ఆలోచన, ప్రవర్తన చిత్రణ. 3.లక్ష్యం 4.క్రియాశీలత

ముందుగా పాత్ర జీవిత చరిత్ర : ఇది రెండు రకాలు 1.అంతర్గత చరిత్ర (కథలో మనం చూడని పూర్వ కథ) 2.బహిర్గత చరిత్ర (ప్రస్తుతం చూస్తున్న కథకి సంబంధించింది)

I.1.అంతర్గత చరిత్ర: మనం చూస్తున్న కథలో ప్రధాన పాత్ర ఫలానా విధంగా ప్రవర్తించడానికి మూలాలు ఆ పాత్ర గతజీవితంలో వుంటాయి.
వీటిని అర్థం చేసుకోవల్సి వచ్చినప్పుడు మనం జరుగుతున్న కథలోంచి వెనక్కి వెళ్లి వాటిని చూడటమో లేదా ఆ పాత్రని దగ్గరగా గమనించిన పాత్ర అతని గతాన్ని సంభాషణతో వివరించినపుడో వీటి ప్రస్తావన వస్తుంది
ఇది రెండు రకాలు a).పరిభ్రమణ వృత్తం b.) బాహ్య ప్రేరణ

a).పరిభ్రమణ వృత్తం: ఇందులో మొదటిది బాల్యంలో లేదా యవ్వనంలో జరిగిన సంఘటన వల్ల ఒకే ఆలోచనా పరిధిలో గిరికీలు కొడుతూ వుండే పాత్రలు. ఈ ఆలోచనా విధానం వల్ల ప్రస్తుత జీవితాన్ని ఆనందంగా అనుభవించలేవు. ఖచ్చితంగా ఇటువంటి పాత్రలకి ప్రేరణ కలిగించే వ్యక్తులు తారసపడాలి. అప్పుడే ఇవి ఆ సమస్య నుండి బయటపడగలవు లేదంటే ఆ సమస్యనే పెద్దదిగా భావిస్తూ తమ జీవితాన్ని స్వయంగా లేనిపోని కష్టాల్లోకి నెట్టుకుంటారు లేదా సంఘ విద్రోహిగా తయరవుతారు.
Ex: The Silence of the lambs, Thelma and Louise, మన్మధ, ఎర్రగులాబీలు

b.) బాహ్య ప్రేరణ: పరిణతి చెందిన వ్యక్తి జీవితంలో ఎదురైన సంఘటన అతని అలోచనా విధానాన్ని మార్చి తాననుకున్నది సాధించే సంకల్పం కలిగిన పాత్రలు. ఇవి ఎక్కువగా ఫ్లాష్‌బాక్ కథనాల్లో వుంటాయి.
Ex: సమరసింహా రెడ్డి, గజని

2.బహిర్గత చరిత్ర (ప్రస్తుతం చూస్తున్న కథకి సంబంధించింది) : పాత్రకి సంబంధిన పూర్తి సమాచారం రాబట్టే ప్రయత్నమే ఇది.
1.వృత్తి 2.కుటుంబ 3.వ్యక్తిగత జీవితం అతని అభిరుచులు, ఇష్టాయిష్టాలు కుటుంబ సభ్యులతో, సహ ఉద్యోగులతో సంబంధ బాంధవ్యాలు.
ప్రేమ వ్యవహారాలు, అతని దైనందిన జీవితం లాంటివి. వీటి గురించి అవసరమైనంత వరకూ ప్రతి వివరం మనల్ని మనం ప్రశ్నించి రాబట్టుకుంటే పాత్రల గురించి పూర్తి సమాచారం మనదగ్గరున్నట్టే.

II.రెండవదైన ఆలోచన, ప్రవర్తన చిత్రణలో నాలుగు కోణాలుంటాయి.
a).మానసిక చిత్రణ: దీనిలో మూడు అంశాలు ప్రముఖ పాత్ర వహిస్తాయి

1.వ్యక్తిత్వం : మానసిక స్వభావం, మానసిక సంతులనం, విషయాలకి స్పందించే గుణం, వ్యవహారాలు నిర్వహించే తీరు, తన గురించి తన అలోచన.

2.దృక్పధం : వ్యవస్థని చూస్తున్న దృష్టి. ఇది వ్యక్తిత్వంపై ఆధారపడి వుంటుంది.

3.వైఖరి: ఇతరులతో పోల్చి తనని తాను చూచుకున్నప్పుడు అతని ఆలోచనా విధానం

b).ప్రవర్తన : ఒంటరిగా వున్నప్పుడు, దగ్గరి వారితో, తన చుట్టూ వున్న వారితో ప్రత్యక్షంగా, పరోక్షంగా వున్నప్పుడు అతని మాటలు, చర్యలు ఇవన్నీ అతనేమిటో తెలియజేస్తాయి. పై మూడింటిని ఇతని ప్రవర్తన ద్వారా మాత్రమే మనం అర్ధం చేసుకోగలం. ఓ వ్యక్తి ఏవరో తెలుసుకోవాలంటే అతని మాటలు కాదు చేష్టల్ని గమనించు, అతనెవరో అర్ధమవుతుంది అనే నానుడిలో ఎంతో నిజం వుంది. ఉత్తర కుమారుడి మాటలకి, అర్జునుని మాటలకి - వీరిద్దరి చర్యలకి ఎంతో వ్యత్యాసం వుంది. అంతే కాక Film is behavior అనే సామెత ప్రకారం మనం ఎక్కువగా పాత్ర ప్రవర్తనని దృశ్యరూపంలో చూపించడానికే ప్రయత్నించాలి.

III.లక్ష్యం (Aim & Line of Action) : పాత్ర తన జీవితంలో సమతౌల్యాన్ని దెబ్బతీసిన సమస్యని పరిష్కరించడమే పాత్ర ప్రధాన లక్ష్యం. దీనితో పాటు పాత్రకి ఉపలక్ష్యాలు కొన్ని సినిమాల్లో వుంటాయి. ఈ రెండిటినీ కథలో పరస్పర ఆధారితాలుగా చూపించడం కథకి వన్నె తెస్తుంది. ఇది కథకుడికి కథపై వున్న పట్టుని తెలియజేస్తుంది.
ex: The Silence of the lambs చిత్రంలో ప్రధాన పాత్ర లక్ష్యం సీరియల్ కిల్లర్ పట్టుకోవడం కానీ ఆమె ఈ లక్ష్యాన్ని సాధించేలోపు ఆమె చిన్నతనంలో చూచిన భయానక సంఘటన వల్ల ఏర్పరుచుకున్న భయాల్ని అధిగమించాలి. ఈ సినిమాలో తను రెండు లక్ష్యాలని ముగింపులోనే సాధిస్తుంది.

IV.క్రియాశీలత (Activism) : కథలో తనకి చెయ్యడానికి పనేం లేక ప్రతినాయకుడు ఎప్పుడు ఏం చేస్తాడా? అతని చర్యకి ప్రతిస్పందిద్దామా అని కూర్చునే పాత్రలు లేదా అవసరమున్నా లేకున్నా తనకి సంబంధంలేని విషయాల్లో తలదూర్చే పాత్రలు మనకి యాక్షన్ సినిమాల్లో కనిపిస్తాయి. క్రియాశీలత వున్న నాయకుడు కథని ముందుకు నడిపిస్తాడు, తన అలోచనా విధానానికి అనుగుణంగా పాత్రల్ని మలచుకుంటాడు. ఎవడి చేతిలోనో రిమోట్‌లా పనిచెయ్యడు. వాస్తవంగా చూస్తే నాయకుడు కథలో అడుగుపెట్టక ముందు నుండీ కథలో సమస్య వుంటుంది. అధికారం ప్రతినాయకుడి చేతిలో వుంటుంది. కానీ నాయకుడు కథలో ప్రవేశించగానే కథ అతని ఆలోచనా విధానానికి అనుగుణంగా మారిపోతుంది. ఇక్కడ పరిస్థితులు ఇలా వుండాలని అతను శాసిస్తాడు. పరిస్థితులు అదుపులో లేకపోతే వాటిని తన అదుపులోకి తీసుకొచ్చే చర్యలు చేపడతాడు. ప్రతినాయకుడు స్తబ్దంగా వున్న శక్తి ఐతే నాయకుడు క్రియాశీల శక్తి ఇవి రెండూ ఢీకొన్నప్పుడు ఘర్షణ పుడుతుంది. ఘర్షణ జరిగినపుడే కథ అభివృద్ధి చెందుతుంది.

12 Sequences వ్యాసం చూడండి.

- మూల్పూరి. ఆదిత్య చౌదరి
(greenlong2498@gmail.com)

Posted by Aaditya Chowdary Mulpuri at 3:18 PM

 +1 including SUDHA

